# క్విట్ తెలంగాణ

## కైతల్

బాకుల్ బరిసెల్ బందూఖుల్

ప్రచురణ

'సింగిడి' తెలంగాణ రచయితల సంఘం





## ఎహె.. ఇగ నే నిన!

- రామా చంద్రమౌళి

'అయ్యా.. తెలంగాణ కావాలె'
మేమందరం గదే ఆలోచిస్తానం కల్సికట్టుగా.. జరాగు
రేపు ఢిల్లీకి పోతం చర్చలు చేస్తం

'అయ్యా.. మా తెలంగాణ మాక్కావాలె'
ఒక కన్నుతో నిన్ను చూస్తాన.. ఇంకో కన్నుతో వాన్ని చూస్తాన
ఇగో తెస్తాన.. అగో ఇస్తాన జరాగు

'అయ్యా.. తెలంగాణ కావాలె'
అరెవారీ చూసి చూసి నా రెండు కండ్లూ పోయినై
తెచ్చేదీ.. ఇచ్చేదీ.. చచ్చేదీ ఐపోతాంది
జ్రరాగు ఒక కమిటీ ఏత్తానం
మేమేం జేయాల్నో చెప్తది

'అయ్యా.. తెలంగాణ కావాలె'
రిపోర్టచ్చింది.. చదువుతానం
అభిప్రాయ సేకరణకు అధ్యయన కమిటేస్తానం
జరాగురా
ఏందిరో మా లావెగుర్తానౌ

'నీయవ్వ.. గుత్పందుకస్తానాగుర
లంజకొడ్కా నాకు తెలంగాణ కావాలె'

# తల్వార్

- స్కైబాబ

ఆరే.. ఆంధ్రోడా!
పువ్వు-రాయి-బోనం-బతుకమ్మ
డప్పు-దరువు-ఆట-పాట
ప్రకృతి అంతా మీకు ఎదురుతిరిగిందిరా
ప్రకృతికి విరుద్ధంగా నిలిచిన మీ ఉనికిని
వేర్లతో సహా పెరికెయ్యడమే ఇక తరువాయి

మొహంపై పువ్వు
మనసులో ముల్లు
ఇంకా ఎన్నాళ్లు ఆడతార్రా నాటకం
ఇన్నాళ్లూ మేస్తిరి గదరా..
మనిషి ముసుగుల్లో ఉన్న పందికొక్కుల్లాగా
థ్ఫూ.. నీ యవ్వ
మొహంపై ఉమ్ముతున్నా ఇంకా వేలాడుడేంద్రా
సిగ్గూ శరం లేనోళ్లలాగా..
నీతి తప్పినోళ్లార్రా- నియ్యతి లేనోళ్లార్రా
నిప్పుల మీద నీళ్లు సల్లుదామని చూస్తున్నార్రా
ఇక్కడ నీళ్లే నిప్పై మండుతయ్ బిడ్డా
కన్నీళ్లే నిప్పు రవ్వలై లేస్తయ్
ఔ...
మా కణం కణం రాజుకుని
అణువణువూ నిప్పై ఎగుస్తున్నది
మా నేల తల్లి నేర్పిన ఓర్పే- మమ్మల్నింకా ఆగబడ్తున్నది
ఓపికకూ హద్దుంటుంది బిడ్డా
ఇంకా మా ఓపికను పరీక్షించొద్దు
దేహాలు తల్వార్లై లేస్తయ్
నంగి నంగి వేషాలొద్దు
నక్క తెలువులు ఇంకా చూపెట్టొద్దు
కనలి కనలి అగ్నిగుండమై ఉన్నోళ్లం
రగిలి రగిలి రక్త కాసారమై మరుగుతున్నోళ్లం
ఇంకొక్క చాన్సిద్దామనే ఊకున్నం

లేదంటే- ఒంటితో మంటను రాజేస్తున్నోళ్లం కదా
కత్తిసాము చెయ్యడం కష్టమేం కాదు మాకు
దేహాన్ని చిటికెలో భస్మం చేస్తున్నవాళ్లం
అడ్డొస్తే అడ్డంగా నరకడం పెద్ద పనేం కాదు మాకు
గోస తీస్తున్నది మేము
తీర్పులు మీరు చెప్తార్రా!
మేడలు కట్టుకున్న మీ ఆధిపత్యం
మేము నినదిస్తే బీటలు వారుతుంది
మా శ్రమశక్తిని మా సంపదను దోచి
ఎన్ని అక్రమ నిర్మాణాలు చేసిర్రో
లెక్కలు తేలాలి బిడ్డా

బేవఖూఫుల్లారా! ఇంకా ఐక్యత గురించి మాట్లాడకుర్రా
మీరు మెక్కిన మా ఆస్తినంతా కక్కిస్తాం
మా నేల మీకు ఉమ్మడి ఆస్తి ఎట్లా అయ్యిందిరా
మీ ఇంటినో మీ ఇంటోన్నో
ఉమ్మడి ఆస్తి అంటే ఊరుకుంటార్రా
చాలు మీ నఖరాలు
తట్టా బుట్టా సర్దుకోవాలె
బెజవాడకు మెయిలు కడతం
బద్మాష్‌లంతా భగాయించాలె
మళ్లీ సూడొద్దు మా హైదరాబాద్ దిక్కు
మజాకైతున్నాద్రా..! ఇజ్జత్ తక్కువ నా కొడకల్లారా..
ఊకుంటుంటే ఉపాయాలెక్కువ జేస్తున్నరేంరా
బొక్కలిరగ తంతమ్- ఉచ్చ పడాలె బిడ్డా
అష్టదిగ్బంధనం చేస్తాం
ఎటూ పారిపోలేరు- పాతరేస్తం కొడకా!

ఇదే మా ఆఖరి పోరాటం
ఈ మోఖా తప్పించిర్రో
మా ఓపికల బంధనాలు విప్పుతాం
నాలుకలు చీల్చడం కాదు
అవసరమైతే అడ్డొచ్చే దుర్మార్గుల్ని
పచ్చిచేపల్ని చీల్చినట్లు చీలుస్తాం
ప్రజాస్వామ్యం మా నమ్మకాన్ని కూలదోస్తే
మేము దాన్నే కూలదోస్తాం
ఖబర్దార్!

# ఒగలెందుకురా
# నగదు దొంగల్లారా!

- వేముల ఎల్లయ్య (ఉస్మానియా)

మాట విచ్చిన నేల
మొల్క అల్కిన పదం
పుదిచ్చిన పురుటి మట్టి
తలం పచ్చి నెత్తురు పటువ
తిరమైన జాడ
దోసిలి ఎత్తిన జీవ్లూ
వీలునామ జావు
ఆత్మలు తెగిన గొంతికలు
రువ్వడి నినాదం
చేను కంకుల నడుమ
మొల తెగిన గజ్జె
ఒక కడవెండి

చెంగలిచ్చిన అడ్వి
ఆకు రెక్కలల్లి
ఆదివాసి బువ్వ ఇష్టబంతి
నిదుర తొట్టెల
గీ బూమి పసరు పిడిశె
అలికిన ఎరుకలి వాడ
వలసాంధ్ర మింగిన తండ
రొమ్ము పాల దంద

పొట్ట గంజి కొడ్కా ఎచ్చిడా ఏతులబడ్తవేందిర
పెట్టువడంటె పొట్టబల్గజీర్తం లమ్డికొడ్క
ఏంర నఖరాల్ రుబాబేంది బే
మొలేసి తల దీస్త్రార

అడ్డ బితాయించి
గడంచె వంచుదుగాళ్లార
ఇగుర ఎరుకుందిర మీకు
అరేయ్.. ఓరారి ఆంధ్రోడ
చెంగడబింగడ ఎగురుడేందిర
కిచ్చ కిచ్చ బల్లి పల్కిన సప్పుదు
కిష్నా కిష్టా శ్రీక్రిష్న
మురిపం తీర్పారం తీర్పొచ్చిందో
మలిషి ముడ్నె నూక్కో
ఔలె.. అర్దనేమ్లకె
ఉద్యమం అమ్మే ఉర్లెడ్డి కొడ్కా ఓరి దొర
బుడ్డసంచి ఒట్టలు మోసే
నగదు దొంగలారా! ఒగలెందుకుర?
మూతినాకుళ్ల ముచ్చట నాయకత్వ లక్షణముందార
కైత్కం అల్లిక కాలం మారింది
కులకట్టు కొలిమి రగిలింది
మొగులు ఎద్దుపుండై బొగిలి ఒలికిన నాత్రి
గుర్గీ దీపంత బత్తి కాలిన నిప్పు
లపూటు లత్కోర్ లక్పతి సీమాంధ్రుడా
లంజొడ్కా! గిప్పుడు తెలంగాణ క్షపణి ప్రయోగి
భారత్ డైనమిక్ లిమిటెడ్
తెలంగాణ రాష్ట్రం జిందాబాద్

# త్రిలింగపాంచభౌతికం

- దెంచనాల శ్రీనివాస్

ఎవడి నెత్తురు ఈ నీరు?
ఎవడి దేహం ఈ భూమి?
ఎవడి శ్వాస ఈ గాలి?
ఎవడి బతుకు ఈ ఆకాశం?
ఎవడి దుఃఖం ఈ అగ్ని?

# ఆంధ్ర కీటకం

- అర్చన సొంటి

పొగబెడితె పోదు
మంట పెడితే పోదు
మరి ఏం చేస్తె పోతది?

మన ఎంగిలి తిని బతికి
పెరిగి పెరిగి యాభై ఏళ్లల్లో
రాక్షస రూపం దాల్చిన  కీటకం
ఏం చేస్తె పోతది?

తమిళ సోదరులను
మింగ జూసి
దారి మళ్లి మనమీద పడి
మన సొమ్ము దోచుకొని
మనకే నుమాయిష్ చూపుతున్న కీటకం
ఏం చేస్తె పోతది?
మరి ఏం చేస్తె...?

రక్షణ కోసం ఇప్పుడు జాలలల్లుకుంటుంది...
భయమా నాటకమా?
ఇప్పుడు మనం పెట్టాల్సింది
పొగ కాదు మంట కాదు
మరి ఏం?



# ఇగ ఆయుధమైన !

- జూపాక సుభద్ర

గీ బుచ్చి బుచ్చి గావురాలు
ఉద్దరికాం ఏశాలతో
నా కలల్ని నానబెట్టే ముచ్చటే వొద్దు
నా ఒంటి నిండా రచ్చలు రాతలు వాతలు సావులు
ఒప్పందాలు ఓటములు
మీటింగుల ఫిట్టింగుల
ముట్టుగుడ్డల్ని బురదల తొక్కుత
నా మట్టి పుట్ట చెరువు శెల్క
వాగు వంకలు చెట్టు గుట్టలు నీళ్లు నిప్పులు
పశువులు పక్షులు
గడ్డి గాదం గనులు వనాలు
పల్లెలు పట్నాలు సమస్తం
పదునెక్కిన పంతమై
గోంగూర పూతరేకులా రాగి 'సంకుటా'ల
పెత్తనాల అంతం పాటలు పాడుతున్నయ్

నా చీకట్లను చీరి పారేసే ఆశలు
అలుగు వడి కీకెలు వెదుతన్నై
గా వలస మాయల మరాటీ
నన్ను కుక్కను జేసి
ఎల్లకాలం బాంచిర్కం చేయించేదానికి
కుతంత్రాల ఉరులు పేనితే
బట్టెబాజితనంతో బందూకులు పారిస్తే
మట్టి కాళ్ల మైసమ్మనై మట్టుబెడత

'69ల ఆగమైన తెలంగాణను కాను
ఇప్పుడు ఆయుధమైన తెలంగాణను
సావకుండా చంపైనా రేవుకు చేరే
తెగబడిన తెలంగాణను

# క్విట్ తెలంగాణ

– ఐనాల
– గద్దపాటి

మరుగుతున్న నెత్తుటి మడుగుల్లో ముంచిన
జెండాల్నెత్తుకున్నం
తాడో పేడో తేల్చుకుంటాం
దించుడు లేదిక – దంచుడే !

నా భాషను బద్నాం చేసినవ్
నా యాసను హేళన చేసినవ్
నన్నొక విలన్‌గా చూపిన
నీ సీన్మాల్ని
ఎడం కాల్తో తన్ని
చిందు ఎల్లవ్వ కాలి గజ్జెలమై
మేం వస్తున్నాం
మీ మాయదారి
రాయబార ఘట్టాలిక ముగిశాయ్
రానున్నది మహా సంగ్రామం
తెలంగాణ గూడేల గుడిశెల నిండా
నిండుకున్న విషాదాల్ని చీల్చుకుంటూ వచ్చిన
పోరుకేక
క్విట్ తెలంగాణ !





# దెంగెయ్!

- ఐనాల
- స్కై

ఇగెట్ల కలిసుంటంరా
నా బతుకమ్మ నీకు తెల్వకపాయె
నీ అట్ల తద్దె నా కంటక పాయె
మొదట్నుంచి అంతా మోసమేనాయె
నేలను దోస్తివి
మావోళ్లను బీళ్లను జేస్తివి
'గలగలా గోదారి కదులుపోతుంటేను...'
ఇంకెంత కాలం పాడను నీ మోసపు పాటను
'మా తెలుగుతల్లికి మల్లెపూదండ...'
ఇంకెంత కాలం నీ గారడీ పాట
కడుపు కాలిన నాకు
కడుపు నిండిన నీకు
ఏకాభిప్రాయం ఎన్నటికొచ్చేన్రా
నిజాల్ని నిలువునా తొక్కిపడ్తూ
బరితెగించిన
నీ మాటలు వింటనే ఉన్నం
రోడ్లమీదికి మేమొస్తే బంగ్లాలల్ల నువ్వు కులుకుతవా?
రగులుతున్న కడుపుల్నుంచి మేం నినదిస్తుంటే
నువ్వు వంకర నవ్వులు నవ్వుతవా?
జైల్లల్ల మేం మగ్గుతుంటే దర్బార్‌ల నువ్వు కూసుంటవా?
భాడ్‌ఖావ్!
దెంగెయ్ నా కొడక

# బొండిగ పిసుకుతం

-పరీక్షిత్

తెలంగాణ బంగారు గనులను
ఆంధ్రోళ్లే అమ్ముకతిన్నరు
ఆంధ్రోళ్లే మమ్ముల గొన్నరు
తెలంగాణ విద్యుత్ మెత్తను
ఆంధ్రోళ్లే ఏసుకొని పన్నరు
మరి ఎవలో వీళ్ళను కన్నరు
తెలంగాణోద్యోగపు పండ్లను
ఆంధ్రోళ్లే తిన్నరు
పసిగాయలకు కాసుకొని ఉన్నరు
తెలంగాణకు వచ్చిన పాల్లను
ఆంధ్రోళ్లే మస్తుగ మెక్కిరు
మా కండ్లల్లో కారం గుప్పిను
ఇంకేమున్నదని మాకాన్నే నక్కిను?

ఇదేందుర్రా? పూర్తి అన్యాలం చెయబడితిరి
గింతగనామా...! ఏదేశాన్నైన ఉన్నదా గిట్ల
పపంచానెక్కన్నైనున్నదార్రా గిట్లా
ఊ...డే...
అరెరెరెరే
ఊకుంటాంటే ఊకుంటాంటే- ఈళ్ళు గిట్నే అంటరు
మేం గిట్లనే నడవనిత్తమనుకుంటాండ్ల ఏంది?
ఏందిరో... హెచ్చిరిక చేయబడితిరి నెరి...
ఏమో పురగా ఎద్దిడిసినట్టు
ఇగనో ఇగనో- ఇగనో అంటే
ఇగలేదు అగలేదు
ఎంతకని ఎదురుచూడాలే
నకరాల్ చేత్తాండ్లు దొంగలంబిడి కొడుకుల్
ఇగ బొండిగె పిసుకుడే
గదొక్కటైతే అయిపోతది లొల్లి
ఖతం !



# ఎడం కాలుతో తంతా!

- గుడిపల్లి నిరంజన్

సెప్పుతో సెప్తున్నా- నిప్పుతో సెప్తున్నా
తెలంగాణ నినాదాలు డప్పులై మోగుతుంటే
వినపడదా? కనపడదా?
సెవులల్లో సెట్లు మొల్సినవా ఏంది?
భావోద్రేకం లేని భంగిమలో పడుకొని
శవాసనం ఏసింద్రా ఏంది?
అంగ స్పర్శ లేని మనుషులా ఆంధ్రోళ్లు!
మరీ మొదనష్టపోడు కాకపోతే
ఎగ్గు సిగ్గు లేకుండా- పొమ్మంటే పోవేంది
పౌ(పు)రుషత్వం పోయి- జడత్వం వచ్చిందా ఏంది?
అరె... నీ జాండిస్ కండ్లకు
మా అన్యాయాకలి కనపడదురా
నీళ్లను నిధులను తీస్కొని- నిద్ర నీల్లకు
మంచిగుంటే మంచోన్ని
తిక్కలేసిందంటే- నీ ధవళేశ్వరంలో
నా ఆరోవేలు అద్దుతా
సరిపోకపోతె అడుగు
నా జననాంగాలు కడిగిన నీళ్లున్నాయి తీస్కో
ఇంకా కావాలంటే
ప్రకాశం బ్యారేజిలో ఉచ్చపోస్తా తీస్కో!
అసోయ్.. దోపిడోడా!
నీ స్వకుచమర్ధన ఉద్యమానికి
ప్రపంచ సమర్ధన ఉన్నదానయ
అరె ఏం మనుషుల్రా బై మీరు
ఇగో... నీవు కలిసుండడానికి ఎన్ని కథలైనా సెప్పు
అవి వాడి పడేసిన నిరోధ్ లాంటివి
ఇప్పుడు నీ సమైక్య వాదాన్ని
ఎడం కాలుతో తంతా!

# క్విట్ తెలంగాణ

-జనజ్వాల

కంట్లో అగ్గిపుల్ల గీసుకొని తానం జెయ్
వీరుడవో.. ఉత్తుత్త పిరికిసన్నాసివో
వెలుగు ఒక జవాబును ఇప్పుతుంది
రోజూ పువ్వులై వికసిస్తున్న
అమరుల శ్వాస కింద
ఒక చెయ్యి చాపి చూడు
జీవిత స్పర్శంటే ఏమిటో బతుకంటే తెలుస్తుంది
నిన్నా నేడు రేపు ఎపుడైనాకానీ
బతికి బతికున్న కాళ్ళకు చలనం కావాలి
మట్టి మీద ముద్దు పెట్టి ప్రశ్న మీద ప్రమాణం చేసి
ప్రవాహ జవాబుల్ని అలలు చేయాలి
సాహస శ్వాసలతో శాశ్వతంగా మళ్ళీ ఆకాశ భూగంగలై
అగ్ని పునీత ప్రశ్నల వీచికలు కావాలి
జనవరి ఒకటైనా డిసెంబర్ చివరైనా
మనం రాసుకున్న లెక్కల్లో
ఎక్కలై ఏకంగా జీవిత గ్రంధాలు కావాలి
అందుకేనోయ్ స్నేహితుడా..
నా గుండెకోసి దాసుకున్న
రక్త బిడ్డల అక్షరకణాలతో
మొలకెత్తిన అమరుల పిడికిల్ల మీద
చినుకులై కురుస్తున్న
చీకటి వీపు మీద ఒక దెబ్బ వేసి
అమ్మతోడు అమ్మా అనిపిస్తున్న
ప్రశ్నమీద ప్రమాణం చేసి
మరొక అడుగు కోసం
శకలాలను ఏరుకుంటూ సవ్వడుల్ని వెతుక్కుంటూ
ఒక పాటను గొంతులో నాటుకొని
దేశం కోసం- నా తల్లి తెలంగాణ విముక్తి కోసం
కాలం మీద కొవ్వత్తి ప్రమిదనవుతన్న
క్విట్ తెలంగాణ

# రాళ్లవాన

- ఒద్దిరాజు ప్రవీణ్‌కుమార్

ఊరు ఊరంతా ఒక్కటైంది
ఒక్కటైన ఊరు ఒక్క బాటయ్యింది
బాటంటె గొంతెత్తిన ప్రత్యేక తెలంగాణ ఆకాంక్ష
పిడికిలెత్తిన నిప్పు కణికల వెల్లువ
ఉప్పెనై ఉప్పొంగిన నెత్తుటి సలసల
సీమాంధ్ర పెత్తనాన్ని నిలదీసిన సుడిగాలి
చౌరస్తాను దిగ్బంధం చేసిన పద్మవ్యూహం
నాయకులను ఉద్యమ శిబిరాల వైపు
ఉరికిస్తున్న ఉక్రోషం ధర్మాగ్రహం
మానుకోట మట్టిని పిడికిట పట్టి
సీమాంధ్ర కాలనీలపై- అగ్గిపుల్ల
షాపింగ్ మాల్‌లపై- రాళ్లవాన

# పోరొక్కటే!

- గాదె వెంకటేష్

ఎదురు చూసింది చాలు
ఇగ మిగిలింది
మనకు రెండే రెండు దారులు
ఒకటేమో చావు
మరొకటేమో పోరు
వట్టిగ చస్తే మరణం
పోరాడి చస్తే వీరమరణం
తెలంగాణలో ఎవ్వరూ పోరుకు చూపరు వెన్ను
పెన్నా? గన్నా? కాదు ముఖ్యం
పోరుకు ఇవ్వరా ఊపు
ఆఖరి మోఖకు పొయ్యెర ఊపిరి

# జంగ్ సైరన్

-పసునూరి

గటు మధిర...గిటు కోదాడ...
జెర అటేటు ఆలంపూర్...
కాళన్న ఇగ నీ మాటే ఫైనల్

మనకు మనం సచ్చుడు కాదురాబై
గిప్పుడు మనల సూత్తేనే
వాళ్ళకు వాళ్ళు...సంచులు సర్దుకొని
అటు కూకట్‌పల్లి కాడ
గిటు కాచిగూడ కాడ
టిక్కెట్ బుక్ చేసుకోవాలె

మనల దోచుకున్న పాపం
ఆకాశాన్ని తాకే అందాల భవంతులై పెరిగింది
నిద్రపోయినకాడికి సాలు
పునాదుల కాంచి కూల్చనీకి మందుపాతరలైదాం ఇగలేస్రీ

బాషెవ్వనికి గావాలె గీడ మాయమైతుంటే
గిప్పుడు నాకు బడితొక్కటే చాలు

ఆంధ్రాదొర కనపడితే అడిగితన్నుని
సమైక్యాంధ్రా అంటే అడగకుండనె దంచుని
దంచుతే దడబుట్టాలే
గజ్జుమనాలే కొడుకులిగ
తొవ్వజూసుకోవాలె
పట్టపగలే సుక్కలు సూడాలే
ఆఖరికి మన గడ్డ పేరింటేనే
ఉచ్చబోసుకోవాలే
ఏందో రాత్రంత గివ్వే కలలు...కలవరింతలు

పట్టాలు పీకెయ్యాలె
రోడ్లు తవ్వెయ్యాలె
పంచాది తెగేదాకా నిజంగనే అడ్డుగోడ కట్టాలె
ఎందుకో తెల్వదు...గుజ్జర్ల మీద
రోజురోజుకు ప్రేమ పెరిగిపోతంది

కొమురం భీం ఏంచేసిందు?
తుపాకి పట్టిందు !
సాకలి ఐలమ్మ ఏం చేసింది?
గుత్పకట్టె అందుకున్నది !
మానుకోట పోరగాళ్ళు ఏంచేసిస్రు?
కంకర్ రాళ్ళు పట్టిస్రు !
థూ...నువ్వేం చేత్తానవ్ మరి ?

సలికాసుకుంటాంటే...
మంటొాక ముచ్చటచెప్పింది
నువ్ తగలబెట్టనంత వరకు
నీకు పట్టిన యాభైయేండ్ల శని పోదని !

సాట చీపుర్లు...గొడ్డలి కామలు
తలుపుసాటుకున్నయ్
ఇగ వాటితోని పనిపడ్డది
ఓ పొల్లా...ఇగ నువ్‌గూడ లే
గా కొంగుకింత కారంపొడి కట్టుకో
ఎల్లవ్వ తల్లికి దండం పెట్టు
యాటపోతును కాదు
గీ సారి...
దోచుకొను వచ్చినోన్నే బలిత్తమని
వాని నెత్తురుతోటే
గీ నేలకు శాంతి జేస్తమని...

# ధక్కామార్‌కే నిఖాలో సాలోంకో..

- యూసుఫ్

నా అమ్మగల్లాడిన భాషను
గొంతు దిగకుండా అడ్డుపడ్డదెవడు
ఓనమాలు దిద్దాల్సిన నా చేతుల్ని
ఎడమ నుంచి కుడికి మలిపిందెవడు
నా నాలుకను కత్తిరించి
పరాయి భాషను అతికిందెవడు?
హైదరాబాద్ తహెజీబ్ ని బర్‌బాద్ జేసిందెవడు?
ధక్కామార్‌కే నిఖాలో సాలెకో

ఇక్కడ ప్రాచ్య సంస్కృతి
అక్కడ పాశ్చాత్య సంస్కృతి
ఇక్కడ అలయ్‌బలయ్
అక్కడ అలగ్ సలగ్
ఇక్కడ దిల్‌దార్లు
అక్కడ ఖబ్జాదార్లు
భగావో సాలోంకో!

కమ్మని రుచుల నా ఇరానీ కేఫ్ లెయ్?
గరీబుల ఆసరా దాల్‌ఖానా ఏది?
రాత్రిళ్లు పండించే ముషాయిరాలెయ్యి?
మనసులు ఉరకలేసే మతసామరస్యమేది?
ఎవడు సత్తెనాశనం చేసిందు కలుపుగోలుతనాన్ని?
ఎయ్‌రా భయ్... మల్లి సూడకుంట భగాయించు సాలెగాన్ని!

# లేరా ఎడ్డోడా... లే !

-నెల్లికుదురు నెగడు

లేరా ఎడ్డోడా లే
దొంగా – పోలీస్ ఆట షురువైంది
పొలంల బడ్డ దొంగ బర్లను తరిమినట్టు
జింక పిల్లను సింగం వేటాడినట్టు
ఇగ నువ్ చేసే పని అదే
దీక్షల్లేవ్...ధర్నాల్లేవ్....
ర్యాలీల్లేవ్...రాస్తారోకోల్లేవ్
ఉరికిచ్చి పొర్లిచ్చి
పొలిమేరల దాకా తరుముడె
బడితే అందుకుంటవో
బాడిసే అందుకుంటవో...
తెలంగాణ పేరు వింటేనే వాడికి
నాలుగు ఎకరాలు తడవాలె
కిందామీద ప్యాక్ కావాలే

వలసబతుకులు కాదు
దోచుకోనోచ్చినోడి ఒళ్ళు వాతలు తేలాలి
అప్పుడు బండెనక బండి
గిప్పుడు బడితెనుక బడితె
బొక్కల గూడు కప్పుకోని తిరుగుడు కాదు
వాని బొక్కలిరగ తన్నాలె
బే షెరం బేమాన్ కొడుకులకు
కొరకాసు నూకితే
జాంగర్ల పసరు కారాలె

రోకలి బండందుకుంటే
ఒళ్ళు శెనిగిత్తుల తొక్కు కావాలె
లేరా ఎడ్డోడా లే...
దొంగ–పోలీస్ ఆట షురువైంది !

# మా రాళ్ల మేల్కొంటున్నయ్

- లోచన్

హక్కులను మేం అడుక్కోం
లాక్కుంటాం!
తెలంగాణ మా శ్వాస
దీన్ని ఎవడూ శాసించలేడు

ఎక్కడి వారైతేనేం
పేదోళ్లంతా మా ప్రాణమిత్రులే
లుటేరాల మీదే మా లడాయి
రౌడీల మీదే మా రాళ్లు
పాదయాత్రలు పాపాల భైరవులు
ఈ నేల నేలంతా నెత్తుటి చరిత్ర రాస్తుంటే
మా ఎదలు మండుతున్నయ్
మా ఊళ్లో కదులుతున్నై
మా రాళ్లు మేల్కొంటున్నయ్

ఇన్నాళ్లు సహనమే సంస్కృతి అనుకుంటున్నాం కదా
ఇప్పుడిక సహనం గాడిద లక్షణం అని తెలుసుకుందామా!

# భగావో

-చింతం ప్రవీన్‌వర్మ

గీ కనకమహాలక్ష్మీ రికార్డింగ్ ట్రూపోల్లకోసం
మనం సచ్చుడేంది బిడ్డా
గీసారి మనం కాలుడుకాదు
వాళ్ళనే ఉచ్చబోసి కాళబెట్టాలె
ఊరొదిలిపోయేదాకా
క్విట్ తెలంగాణే !

అండ్లతంతే భద్రాచలం పాతమాట
ఈ సారి ఈడ్సి తంతే ఇశాఖపట్నంల ఇడ్లే దిక్కు

మెత్తని మాటలతో చెప్పుడై పోయింది
ఓపిక నశించింది
ఇగ లేద్రి
ఇగ లగాంచి ఒక్క లాత్ కొట్టుద్రి

మన దెబ్బకు వాడు ఆగమాగం కావాలె
పంచెల రెండుకు పోవాలె

యాభైనాలుగేండ్ల సంది
ఇగ్గపట్టుకున్న ఆవేశాన్ని
ఉచ్చపోసినట్టు
తలాకొంచెం చిమ్మించిపోద్దాం !!

# ఇదే మోక.. ఒత్తర పీక

-తెలంగాణ శ్రీనివాస్

వాడి పడగ నీడకింద ఇంకెంత కాలం !
యేండ్లకు యేండ్లు ఒడిసిపాయే
పొద్దుపొడవదాయే
పొయిల పిల్లి లేవదాయే
సీకటి ఒడువదాయే

మాది మాకియ్యుర్రని
ఎంతకాలం గీ అడుక్కునుడు?
ఊంచిన తుడ్సుకొనెటోళ్ళతోటి
ఇంకెట్ల నెగులతం...
మనం తగులబడుతుంటే
వాడి తెలుగుజాతంటంటే..

పక్కలేసేటోనితోటి సోపతేంది
దెంగయ్ అంటే నైహమ్ అనెటోనితోటి
ఇగ మాటల్ సాల్ !!

మన జాగలకెళ్ళి ఖాళీ చేసే దాకా
గుత్పులు పడదాం
పొలిమేర తొవ్వ సూపిద్దాం
పొద్దుపొడుపు గుండెల మీద
మండే సూర్యులమైదాం
నీడై వెంటాడేటోన్ని
బొడ్రాయి కాడ ముక్కురాకిద్దాం
మూడుచెర్ల నీళ్ళు తాగిద్దాం
యాభైయేండ్ల శనిని ఒదిలిద్దాం !!





# ఏ టూ జెడ్ తొొలగిపో

-బెల్లంకొండ సంపత్ కుమార్

కలికుండ కంచుడు మీద
పచ్చని గుమ్మడి నవ్వు తెలంగాణ
నిండుపండు- నిప్పుల గుండమై పూసింది
ఏటిమీద జీరాడింది
ఎండిన భూములల్ల తచ్చాడుతున్నది
యాభైనాలుగేండ్ల బీడు చూడు
హో... అరిగోసల నడుమ
పెట్టుబడుల గాలం- ఎన్నికలకు కాలం
కలికాలం పాడుకాను- మా కలల కాలమెన్నడు?
యాడాది కండ్లల్ల ఒత్తిపెట్టుకొని
హో కృష్ణా! అంటిమి...
సౌక కట్కం రాయి రాలిపాయె
రెండెడ్లు-నాగలి-మట్టి...సాదిన గోడు మిగిలె
కాళ్ళకిందా భూమెట్లా గుల్లయితదో
ఇగనన్న నోరిప్పాలె- వైదొలుగు
పీకేస్తున్న కొద్ది బేషరం వేళ్ళూనుకుంటది
మూలం దగ్గర్నే సమూల బీజం ఉంటది
పంట నాశనం మొక్కా!
కట్టలు తెగిన కేంద్రంల కంకర రాళ్ల ప్రవాహమున్నది
ఎక్స్‌తొలుగు
సముద్రానికి సమాంతరంగా ఈటెశయ్యలు నిర్మించగలం
కత్తులు కలాలు కరచాలనం చేస్తయి
క్విట్ తెలంగాణ! క్విట్ తెలంగాణ!
అనుభవాల అణువణువూ
ఆఖరి విస్ఫోటనానికి సంకలన చర్యవుతుంది
మా నల్లని బొగ్గుల పుట్టిన
తెల్లని కరెంటు బల్బు
ద్రోహాల చీకట్లు చీల్చుకుంటు
ఫిలమెంట్ సీరియల్స్ రచిస్తుంది
స్వేచ్ఛా సూర్యులు మొలవాలె
అమరులు పుడ్తనే ఉంటరు..
ఏటూ జెడ్ తొలగిపో !

# ధిక్కారం

- సూరారం శంకర్

వాదించడానికి నా దగ్గరిప్పుడు సమయం లేదు
దగ్ధమౌతున్న హృదయంలోంచి వాదనలు మొలకెత్తవు

ఈ చెట్టు కిప్పుడు రోదన కూడా నిషిద్ధం
యాభైనాలుగేళ్ల నయవంచన ముందు
మర్యాదకు కూడా చోటు లేదు
నేను సూటిగానే చెబుతున్నాను
మన స్నేహానికి అర్థం లేదు

ఇంకా నేను ఒక్క క్షణం నిన్ను క్షమించినా
జాతిద్రోహినే అవుతాను–
ఔను... నేను పారదర్శకంగానే మాట్లాడుతున్నాను
కంట్లో నువ్వు చిలిచిన ఆసిడ్ చుక్కల సాక్షిగా
ఈ పిడికిలికిప్పుడు ఓటమి లేదు

ఈ యుద్ధానికి ఇప్పుడు అలసట లేదు
నువ్వో నేనో... తాడో పేడో...
తెగేదాకా లాగాల్సిందే...!
కథలు చెప్పడం ఆపు
ఆ చెవికిప్పుడు నీ శ్వాస కూడా నిశిద్ధమే
పాటెత్తుకున్నప్పుడే ముగింపు తెలిసిన వాణ్ణి
అడుగెత్తినప్పుడే గమ్యం చూసిన వాణ్ణి

నువ్వెవ్వైనా చెప్పు
నా గడ్డకు నేను రాజును...
'అభివృద్ధి...'   అరె చుప్..!
నీ దుకాణం సర్దుకో...!
తరాజు తెగుద్ది..!!



# వురికిచ్చుడే...

- రమేశ్ హజారీ

ఆరీ.. అరవై ఏండ్లసంది మమ్ముల అరిగోస పెడుతాంటిరి గదరా..
కట్టుగాల్వల పంది నయం..
యిస్కో అంటే అసుంట వుర్కుతది
ఆరీ.. మీరు ఒకటే అమ్మకు ఒకటే అయ్యకు పుట్టనట్టుంద్రేమిరా
సిగ్గుశరం యిడిశేసి దున్నపోతు తోలుకప్పుకుంద్రేమిరా

మాదేందో మాగ్గావల్నని మేం కొట్లాడుతాంటే
తాగేనీల్లల్ల ఏందోముంచినట్టు తేపకోపాలి సమైక్యాంధ్ర అంటరేందిరా
ఆరీ.. ఎవరి కష్టం వాడు చేసుకొని బతకాలె గని
మంది వూము నాకితే కడుపు నిండుతాదిరా..
తలకాయ పెట్టనిచ్చిన పాపానికి
ముడ్డిసొంతం నూకిన ఒంటెలయితిరేమిరా

మిమ్ముల నిలువెత్తు నిప్పు పెట్టకుండ ఉండలేక
మమ్ముల మేము కాల్సుకుంటాంటిమి గదరా..
ఆరీ.. ఆఖరికి మా ఆత్మబలిదానాలను అంకెల గారడీ జేత్తిరి గదరా..
ఇంకెన్నాళ్లురా మీ మీడియా మానసిక తీవ్రవాదం
మా మంచితనాన్ని చేతగానితనం జేత్తిరి గదరా..

ooo

అన్నా ఇట్లగాదే...
పాటలు పాడుకుంట పానాలు పోగొట్టుకుంట బతుకుడొద్దు
కడుపుల సల్లకదలకుండ కూసున్నకాడ్నే నీల్లాడుతానంటే కుదరదు
అణిగివుండుడు గాదు ఇప్పుడు మనది మనం ఆక్రమించుడు గావాలె
పయినం పెట్టుడు గాదు ఎత్తికొట్టుడు గావాలె
మొకమాటం గాదు మోతమోపియ్యాలె
దండం పెట్టుడు గాదు దంచి కొట్టుడె దగ్గరి దారి
వురికిచ్చుడె వ్యూహం.. ఎగిరి తన్నుడె ఎత్తుగడ
బేర గీసుడయింది.. కుస్తి పట్టుడె మిగిలింది
ఇగ ఇప్పుడు తెలుగోడు లేడు
అయితె ఆంధ్రోడు లేకుండె తెలంగాణోడు
ఇగ ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌ల గాదు
ఉంటె తెలంగాణల లేకుంటె సీమాంధ్రల !

# సిర్రపుల్ల

- వాసు

భళ్లున.. పగిలిందో అద్దం
గదీ మా బత్కు..
ఆగ్రహం.. కలలు
ooo
మాది మాకివ్వాలంటే
వేర్పాటువాదులమంట
కడ్పు సలసల మర్గుతాంది
దేరాలల్ల దేక్కుంటా దేక్కుంట
మంది కొంపలు పన్యానికి ఉన్నయని
'విశాలాంధ్ర' ఆకాశంలో
ఆర్టిఫిషియల్ సూర్యుని సృష్టించిన్రు
ఒప్పందాల పుటలల్ల- ఒక్కో అక్షరం వెనక
కుట్ర మహా కావ్యాలు
సిరాల తడారక ముందే
ఆరో వేలై కళ్లల్ల పొడిచిన్రు
గన్నీ ఎందుకగని..
ఒక్క నీళ్ల మాటే చెప్పుకుందాం
పారకం లెక్క పంపకం అయితే
నీ పారకం ఎంత.. పండేది ఎంత?
మా మర్రిగూడెం చౌరస్తాల
పంచాయితీ పెడ్తే
అంశాలస్వామి అరికాలితో తంతడు
ఇంకా కల్సుందామంటే
పాణాలు తీస్కున్న పోరల ఉసురు తగుల్తది
మల్ల మోసం చెయ్యజూస్తే
గప్పటి ఎడ్డి.. గుడ్డితనం లేదు
అగ్ని పర్వాతాలు అరచేతిల బంధించే
నిప్పు మహాసముద్రం విస్తరించింది...
ఇక ఇందాక వచ్చినంక
అటో ఇటో గాద్.. ఇటే తేలాలి
బాంచెన్ గాదు.. బరిగీసి గెద్మెతందుక్
బలగం కదుల్తుంది

# లాఠీలు తూటాలు ఆపలేవు

- సుజాత సురేపల్లి

సిగ్గు లజ్జ లేని శవ రాజకీయాలను చేసే
నాయకుల్లారా మీరు
ఈ తెలంగాన గడ్డ బిడ్డలైనందుకు
మా చావులు, మాపై విరిగిన లాఠీలు
చిందిన రక్తం, మిమ్మల్ని కదిలించనందుకు
మీ మౌనాన్ని చూసి
మమ్మల్ని మేమే అసహ్యించుకుంటున్నం
రాపిడిలో పుట్టేవి అగ్గి రవ్వలే
పిల్లిని పట్టుకొని కొడితే అయ్యేది పులే
ఇక్కడ రక్తంలో అమాయకత్వం ఉంది
అట్లనే విప్లవం కూడా ఉంది
బ్రిటిష్ రాజరికపు గోడలను
దొరల గడీలను రజాకార్లను
కూల్చిన రక్తం
గుండుకు గుండె పెట్టిన ధైర్యం
అన్యాయాన్ని భరించలేక
ప్రాణాలను కూడ లెక్క చెయ్యని యువరక్తం

ఈ అణచివేతలు ఊచకోతలు
హింసలు విధ్వంసాలు
తెలంగాణని ఆపలేవు
మంచితనాన్ని అమాయకత్వాన్ని
అణచివేస్తే వచ్చే ఆవేశాన్ని
దాని రూపాలని
అంచనా వేయలేవు
సైన్యాన్ని దింపితే
అక్కడ జరిగేది యుద్ధమే
మర్యాద తప్పితే మారణ హోమమే
మానవత్వాన్ని మంచిని మరిస్తే
తయారయేది మానవ బాంబులే
శాంతి కావాల్నా?
అశాంతి కావాల్నా తేల్చుకోండ్రి

# సచ్చుడు కాదు, .. .. .. !

- జానపాడు సైదా

నాలుగొందల మందిమి సస్తె
ఏం కాలె...
ఒక్క నలుగుర్ని ఏస్తె ...... !

అన్యాయం ఎవడు చేసినా అన్యాయమే
దురాక్రమణ ఎవడు చేసినా దురాక్రమణే
లే..!
షోయబుల్లాఖాన్ దూసిన అక్షరానివి కా!
భగత్‌సింగ్ బందూఖ్ నుంచి
దూసుకొచ్చే తూటావి కా!
అల్లూరి వదిలిన బాణానివి కా!
కొమురం భీం విసిరిన బాకువి కా!
ఐలమ్మ ఎత్తిన గుత్పవి కా!
ఉద్యమకారుడి కాగడావి కా!
కొర్కాసువి కా!
నిలువునా తగలబెట్టు వాణ్ణి
మన న్యాయమైన ఆకాంక్షను కాదంటున్నవాణ్ణి
తగలబెట్టు సర్వస్వాన్ని
మనల్ని దోచి కూడబెట్టుకున్న దోపిడి సొత్తును
ఎట్ల రాదో సూద్దాం
మన తెలంగాణ మనకు
లే రా
లే !

# అవును ఇంకా ఎందుకున్నరు..?

- అనిశెట్టి రజిత

కల్లాకపటం తెల్వనోల్లకు
కుట్రలు కుతంత్రాలు ఎరుక జేస్తిరి
అర్ధశతాబ్దంపైన మా ఎడ్డి బతుకుల్ని
పొక్కిలి జేసి సిత్తడి జేస్తిరి
అంగట్ల బెట్టి అమ్ముకుంటిరి
మా కండ్లకు 'సమైక్య' గంతలు గట్టి
దొంగాటలాడి బిక్కసచ్చేట్టు చేస్తిరి
అన్నదమ్ములోలిగ కలిసున్నరా.. హవ్వ!
అయితే అందినకాడికి ఎందుకు మెక్కిను
విశాలాంధ్రమంటిరి
మీరు కుబేరులయితే మేము
కూలోల్లమయి మిగిలినం
మీ దీర్ఘాల ప్రేమలకు మైమరచి
దీర్ఘ రోగులమయినం
ఆఫీసర్లు మీరయితే అటెండర్లు మేమయినం
'ఆర్టిస్టులు' మీరయి వెలిగిపోతాంటే
కండ్లకద్దుకొని నెత్తికెత్తుకొని మోసినం
నాగరికతకు వారసులు మీరన్నట్లు
ఫోలిచ్చుకుంట ఇకిలిస్తిరి
ఒకే తెలుగు జాతి కత్తి
మా కుత్తికల మీద దిగబెట్టి
మాయజేసి మర్మాల పూతలు బూసిన్లు
యాభయ్ ఏండ్లు కక్కిన విషయం
మా తెలంగాణిప్పుడు
సర్కారు తుమ్మల వనం
గాయాలు పచ్చిగ సలుపుతుంటే
మనసిరిగిపోయింది
ఇప్పటికిప్పుడు ప్రేమలు

చిగురులేస్తయా అయ్యలూ..
విలీనాన్ని విద్రోహం చేస్తున్నప్పుడు
ఏ కమ్మని గొంతుకా తప్పని వారించలేదెందుకు?
కళలు కళల కోసమేనంటరు మీరు
కళలు ప్రజల కోసమంటం మేము
మీ కపట నాటకాలు తెలుసుకున్నంకైనా
ఉన్నదున్నట్లు ఉత్తరించలేమా
కడుపుకోతలకు గురైన
మా తల్లుల తండ్రుల సాపెనలకు
'మర్యాదస్తుల' భాషెట్లస్తది
చాల్‌బాజీతనాలకు సత్కారాలు చేసే
సహనం శాంతి జపం ఇగ రాదు
ఇంటింటా ఈ గడ్డి మీది బిడ్డలు
పాటలు పూసిన చెట్లు గిప్పుడు
వారి పాదాలకు శతకోటి దండాలు..
అవును పొమ్మనే అంటున్నం
కల్తీ జేసిన ఈ నేలను విడిచి
పొమ్మనే అంటున్నం
మాటకే మహా ఎగిరిపడ్తున్నరు
బోనమెత్తిన అవ్వ కంటి చూపుకు
ధూంధాంల గజ్జెల మోతకు
ఎటు కొట్టుకపోతరు...?
అంతిమ పోరాటంలో అమరులయిన
అన్నదమ్ముళ్లకు ఆత్మీయులం
మహాగర్జన చేస్తున్నం
సిగ్గుశరమూ ఉంటే గనుక
తిరుగు టప్పా కట్టమనే...!

# వేటాడుతాం!

- సిహెచ్ మధు

సముద్రం ఎగిసిపడుతుంది
మింగటానికి, ముంచటానికి
ఇప్పుడు- తెలంగాణ ఓ మహా సముద్రం
ఎంతకాలం సముద్రం నీళ్లలో కాళ్లుపెట్టి
దోపిడి ఆట ఆడుతారు
కెరటాలు కాళ్లను నెట్టేస్తాయి

తెలంగాణ మాదంటూ నాలుగుకోట్ల జనం
ఒక్క పిడికిలయి
ధిక్కరణ నినాదాన్ని అందుకున్నాయి
కమిటీలొద్దు నివేదికలొద్దు
పిలుపులొద్దు చర్యలొద్దు రాజీలు లేవు
రాజకీయ బేరసారాలొద్దు
ఒక్క తెలంగాణే ముద్దు
తెలంగాణ మట్టి
పోరాట దారిలో కనులెర్ర జేసింది
'మీది మీకు మాది మాకు'
శాంతిగీత కొరకు
దశాబ్దాలుగా పిలుపునిచ్చింది
నినాదాలు రస్తారోకోలు ధర్నాలు బంద్‌లు
జాక్‌లు
పాట ఆట కవిత పోరాట రూపాలపై
ఎత్తులు జిత్తులు రాజకీయ కుట్రలు
'మాది మాకంటే' బలగాల మోహరింపు
ఇక లాభం లేదు
తెలంగాణ తోటలో పడిన నక్కలను
వేటాడక తప్పదు
'మాది మాకు'
గీత గీస్తారా?
తెలంగాణ వీరుల భూమి, పోరాట మట్టి
మెడ బట్టి గెంటుతుంది చూడు

# మంగులం

- అన్నవరం దేవేందర్

కడుపులో గడ్డపారలు వదేసినట్లు
గుండెకాయ కెల్లగించిన నొప్పి
కనుగుడ్లల్ల పచ్చబొట్లు పొడిచినట్టు బాధ
మనస్సు కలి కలి అయ్యింది
తీరొక్క బాధలతో
నన్న మంగులంల ఎంచుతున్నరు
మా వూరి భాష మరిపించి
శాని యాసతో చెవి జోరీగలు అయ్యింద్రు
నా భాష నాకు కన్నతల్లి
నా యాస తల్లి వేరు
మా పండుగలు ఎండగొట్టి
మీ పబ్బాలు గడిపినవ్
మా నీళ్లు మర్లగొట్టి
మీ దొయ్యలు పారిచ్చుకున్నవ్
కొలువులు సదువులు
గద్దోలె తన్నుకుపోయినవ్
మా నీళ్ల పారకమే తక్కువ
ఉన్నకాడికి నువ్వే గొంగడి సాపినవ్
పట్నం సుట్టూ బారాన వంతు
కనీలు పాతుకున్నవ్
ఇంకా ఏం మిగిలిందని
నన్ను నన్ను గాకుండా చేసితివా
కొడకా!
కడుపుల తక పికా ఉడుకుతంది
నా సూరు నీడకు ఉండి
నా మోచేతి నీళ్లు తాగి
నా నిట్టాదు ముంచి
తిన్నింటి వాసాలు లెక్కబెడతవా?
నిన్ను తరిమి తరిమి కొడతం

# పొలికేక

-జిలుకర శ్రీనివాస్

దుమ్ము కొట్టుకపోయిన పేదదానా!
బట్టలు చిరిగిపోయిన మాదిగదానా!
నా తెలంగాణా!
నెత్తురు కక్కుకుంటూ
సూర్యుడు నేల రాలిందు
కత్తికి ఒరుసుకుంటూ
వేల గుండెలు తెగిపడినయ్
కొన ఊపిరి మీద ఆన
నా తెలంగాణా! సావో రేవో తేల్చుకుందామా?

నెత్తురు నిండిందో.. వెచ్చని కన్నీళ్లు నిండాయో
మాటలెండిన పెదాల కళ్లతో
చూసుకునే నా తెలంగాణా! పెట్టుకో కత్తికి సాన

మాదిగ వాడ కటిక చీకటిలో
కన్నీరు కారుస్తూ విలపించే వీరుడా!
ఓరుగల్లు కోటలోని వీరుని గడ్డకు రా!
అమరుల సమాధుల మీద మొలిచిన
గడ్డి పరకల మీద మోకరిల్లు
సిగ్గు లేని మొండి దేహాలను
రోషం లేని నిర్జీవాలను
తలలు నరుక్కుని చేతిలో పట్టుకుని
బానిసలాగే వాళ్లను బతుకనీ
తెగిన మొండెంతో
వీరుని గడ్డ మీద కాకతీయ రాజుల
కత్తి పదును మీద వీరత్వం చూపిన
కోట బురుజుల మీద నిలబడి
పొలికేక పెట్టు
'జాగో తెలంగాణవాలా!
భాగో ఆంధ్రావాలా!'

# ఉంటరో పోతరో తేల్చుకోండ్రి

- దేశపతి శ్రీనివాస్

బర్బాదే జేసిన్రు
బద్నామొక్కటి తక్కువాయెనా?
మాయన్నీ మీరెప్పుడో అంకితం జేసుకున్నరు
మా చెవుల రింగుమని
మీ పాటలు మోగుతుంటే
మేము మహాగాయకులం ఎట్లయితం?
నిలువు నిలువునా కాలిపోతున్న
దగ్ధ గీతాలమౌతాంగాని!
బట్టగాల్చి మీద పారేస్తరా?

ఒక జీవ ధార కోసం
ఎడతెగని పోరాటం
కమిలిన కంఠ నాళాల మీద
ఇంత స్తన్యం కురువాలెననే
పాలు నోచుకోని పిల్లల ఆరాటం
బిరబిరా కృష్ణమ్మ
కనకదుర్గమ్మ కాళ్లు కడుగుతుంటే
ప్రాసాదాలలో మత్తిలిన మీకు
పొక్కిలైన మా నేల మీది
పోచమ్మ కన్నీటి సుడి కనబడుతదా?
మూర్ఛనల గురించి కాదు
మాట్లాడేది
మూలుగ సుత చచ్చిపోయిన
బొక్కల మూల్గుల గురించి
మీ పాపాల గురించి

మీరు ఊగరా ఊగరా అంటే
మేము ఉరికొయ్యలకు ఉయ్యాలూగినం
ఇప్పుడు మా కాళోజీ దాశరథులను
దాచిపెట్టిన కుట్రలను పగలచీరుతున్నం
మీరు మట్టిలో పాతిపెట్టిన
మా వట్టికోటలను తవ్వుకుంటున్నం
భాగ్యాన్నే కాదు
మీరు మాయం చేసిన
భాగ్యరెడ్డి వర్మలను
దుక్కంతోటి యాజ్జేసుకుంటున్నం

మమ్ములను నూకేసి
నిలుచున్న మీ విగ్రహాలను
ఆధిపత్య సంకేతాలుగా
మ్యూజియంలలో దాచిపెడతం

మీ జాగల మీరే
మా జాగలా మీరేనా?
ఇగ ఊరుకునేది లేదు
ఉంటరో పోతరో తేల్చుకోండ్రి

# అగ్గిగుండాలె

- సూరేపల్లి సుజాత

నిన్న, నేడు నీ మోసం చూసి
నీ ద్రోహం చూసి నీ నఖరాల్ చూసి
గుప్పెడు గుండెకు రోషమొచ్చింది
కోపానికి రెక్కలొచ్చినయ్
పౌరుషం భగ్గున లేషింది
రేపటి నిజం బద్దలైంది
నిలువునా నీ వికృతరూపంలా
సమాధులు కదులుతున్నై
ఆత్మలు అంటుకుంటూ సునామీలా ఎగిసిపడుతున్నై
వృథా కానివ్వం మా చావులంటున్నై
పార్టీలు గీర్టీలు జాన్తానై
ఇప్పుడు తెలంగాణల అమాయకత్వం లేదు
నువ్వు మోసం చేస్తే నవ్వుతో మోసే ధైర్యం లేదు
బాంచన్ దొర లెక్కలు లేవు
చావుకొక లెక్క– జాగా కొక ధక్కా
కొమురం భీం బందెగీ ఐలవ్వా
అందరూ కలిసిన బలం, బలగం
కాపాడనీకి నీ అబ్బొస్తడో అవ్వొస్తదో
తమ్మీ! కేశినేనిల బోతవో.. రాయలసీమల తేల్తవో
విశాఖల బడ్తవో
పొల్లు పొల్లు కొట్టి పొలిమేర్లదాకా ఉరికిస్తం
ఉరికొచ్చినోల్లు కుక్కల్లెక్కున్నోల్లు
ఊసెత్తకుండా పోండ్రి
ఆగం జేస్తే బిడ్డా
అడ్రస్ లేకుండా బోతవ్
మా ప్రేమను జూసినవ్ గానీ
కోపం జూడలే ఇప్పటిదాకా
ఒక్కో గుండె ఇప్పుడు అగ్గిగుండాలే!

# బాస్టర్డ్స్!

- ఊడుగుల వేణు

**"నేను నిప్పును**
**నేను నీరును**
**లక్షలాది సైనికుల్లో నేనొక సైనికున్ని"**
సైనికున్ని నేనే
యుద్ధాన్నీ నేనే
యుద్ధభూమినీ నేనే
త్యాగం నా జవసత్వం
పోరాడ్డం నా జీవగుణం
అడవి పొదల్లోంచి బీడుబడ్డ దేహం గుండా
దాహానికొచ్చే సింహంలా
నేను ఎర్రగా ఉదయించాను
ఎర్రగానే అస్తమించాను
మూడు తరాల గోసను మూటగట్టుకుని
నన్ను నేను దగ్ధం చేసుకున్నాను
ఉద్యమిస్తున్న దేహాల్లో
ఉడుకుతున్న నెత్తురై ప్రవహిస్తున్నాను
అలరారే అమాయకపు నవ్వుల్లో
నేడు మేఘగర్జనలు వింటున్నాను
మెరుపు తీగల్ని కంటున్నాను
నా మేరుపర్వతంపై పడి మేస్తున్న దున్నపోతుల్లారా!
మీ మేను పులకరింపులిక చాలు
గతికిన నీళ్లు – మెక్కిన మెతుకులు – బుక్కిన దుబ్బ
కక్కే కాలం దగ్గరికొచ్చింది
నా దక్కన్ పీఠభూమిపై
పీఠాధిపతులమౌదామనుకుంటున్న కొడకల్లారా!
అప్పుడు ఇప్పుడు
ఎప్పుడూ మేం నిప్పులమే!

మీరు నీళ్లు జల్లితే
సప్పుడు చేయకుండా ఎట్ల ఉండగలం
'రాష్ట్ర చిత్రపటాన్ని చించి ఏం సాధిస్తారని'
ప్రశ్నిస్తున్నారు కదా..
మీ సామూహిక పాపాలను దర్శించుకోడానికి
ఒక్కసారి మా బొందలగడ్డకు రండ్రా!
అక్కడ ఎప్పటికీ తెరవని వందల జతల కళ్లతో
ఒక తాత్విక చర్చ జరుపుదాం
సమాధులపై మొలచిన జవాబులు
మీకు స్వాగతం పలుకుతాయ్
బోధపడ్డ సత్యాన్ని దిగమింగుకుని
గుండెల్ని చీల్చుకొచ్చే నినాదాల్ని చెవుల్లో వేసుకుని
వెనిక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోండి
చిట్టచివరి కొమ్మల్లో ఆకుల్లో
హోరుగాలి పురుడుపోసుకుంటోంది
తుఫాను మేఘాలు కమ్ముకుంటున్నాయ్
చేతులన్నీ ఒక్కటవుతున్న చేతనలోంచి
మరో మహాచరిత్ర ఉద్భవించబోతోంది
నా లేత దేహం కాలాక వస్తున్న పొగల్లోంచే
రేపు నవ యుద్ధాలు పుట్టబోతున్నాయి
అదిగో..
మా అక్కలు జడకొప్పుల్లో నిప్పుల్ని పొదువుకుని
మా చెల్లెళ్లు జడల్ని ఉరితాళ్లుగా పేనుకుని
ఆదివాసీ బాణాల్లా ఇంటిల్లిపాదీ దూసుకొస్తున్నారు
మా అరచేతుల్లో మందారాలు పూయకముందుకే
మీ ప్రాణాలు గాల్లో కలవకముందే
బాస్టర్డ్స్! గో టు హెల్!

# బ్లాకౌట్!

- మొగిలి

తెలంగాణ గగన సీమనుంచి
నీరస సూర్యుణ్ణి తరిమికొట్టండి
మనకీ క్షణం పట్టపగల్లు కూడా
నడిరాత్రుళ్లు కావాలి
నిద్రకు వెలియై, ఎవరికి వారు
ఒంటిగా జంటగా గుంపుగా
నిశిరాతిరి మేలుకునేందుకు
అంతా నిదుర జోగుతున్నప్పుడు
గుట్టు చప్పుడు కాకుండా వెలిగే
వీధి దీపాల పని పడదాం పద!
రాత్రులను చిక్కపరుద్దాం పద!
చీకటిలో చక్కబెట్టే పనులు
చాలా ఉన్నాయి మనకిప్పుడు
ధ్వంస రచనకు వేళయ్యిందిప్పుడు
యాభై ఐదేళ్ల చిమ్మచీకటిని
ఉదయాస్తమయాలకు అతీతం చేద్దాం పద!
ఇప్పుడు జాగారం మనకిక నిత్యకృత్యం
జగ్‌నే కీ రాత్ మనకు నిత్య నూతనోత్తేజం
చేతులకు పని చెబుదాం మనమిక
చేతులే చేతులిక
మాటలు, వొట్టిట్టి మాటలు,
రాతలు, పనికి రాని రాతలు వొద్దిక
కలం అవతల పారేసి కత్తి పడదాం!
కత్తి కెర చేద్దాం పద!
బతికి ఉండగానే వాణ్ణి బొందపెడదాం!
మన గడ్డ మీదినించి ఖాళీ చేయిద్దాం పద!
తెలంగాణ నుంచి తరిమి తరిమి కొడదాం పద!
తల దించుకునేలా చేద్దాం పద! తిరిగి లేవకుండా చేద్దాం పద!
వీధి దీపాల పని పడదాం పద!
దివారాత్రుల్ని వెలిగిద్దాం పద!
సంకురాతిరి ఇంటికి పోయినోణ్ణి
అటునుంచి అటే వెళ్లగొడదాం పద!

# నాలో పులులూ సింహాలు

- స్కైబాబ

నా ఒంటి మీది
జీవావరణ్యం ఖబ్జాకు గురయ్యింది
నోటి కాడి కూడు
గూడు తోడు దూరమై...
నాలో గర్జిస్తున్న
పులుల్నీ సింహాల్ని
కట్టి పెట్టాను
బుసలు కొడుతున్న
కోడెనాగుల్ని పట్టి పెట్టాను

పక్షులు ఆక్రోశంతో అరుస్తున్నాయ్
జింకలు లేళ్లు సైతం
పోరుకు సిద్ధమైనయ్

ఇక
నా ఒంటి నరాలు ఓపలేకపోతున్నయ్
కట్లు తెంచుకుని ఈ జీవజాలమంతా
మీద పడితే
ఖబ్జాకోరులారా!
ఫరారవుతరు బిడ్డా
ఖబర్దార్ !

*

తెలంగాణ అమరులకు కన్నీటితో..

## 'సింగిడి' తెలంగాణ రచయితల సంఘం

క





# కైతల్

## బాకుల్ బరిసెల్ బందూఖుల్